
కొండపల్లి
ప్రచురణలు
నా స్నేహితులు
శ్రీ మునిమాణిక్యం నరసింహారావు
వెల
రూపాయి

# నా స్నేహితులు

రచయిత

శ్రీ మునిమాణిక్యం నరసింహారావు

[illegible]

పబ్లిషర్సు:
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

# నా స్నేహితులు

మా యింటికి వచ్చే స్నేహితులలో చాలా సత్పురుషుడూ అమాయకుడూ అయినవాడు శాస్త్రిగారు. పొడుగ్గా బక్కపల్చగా ఉంటారు. పద్యాలు, నాటికలు వ్రాస్తారు. కథలుకూడా వ్రాస్తారు హాస్యధోరణిలో.

రైల్వే బుక్‌స్టాల్‌వద్ద నుంచుని, అందికలో ఉన్న పుస్తకాలలోనుంచి, ఒక్కొటొక్కటే తీసి చూచి మళ్ళీ యథాస్థానంలో పెడుతూ, అరగంటసేపు కాలం గడిపి, ఒక్కపుస్తకమూ కొనకుండా వెళ్ళిపోతున్న వ్యక్తి మీకు ఎప్పుడైనా కనపడితే ఆయనే శాస్త్రిగారు అని మీరు అనుకొంటే నూటికి తొంభై పాళ్ళు పొరపడరు.

ఆయన చాలా తమాషా అయిన మనిషి. సిగరెట్టు తాగడు. తములపాకులు వేసికోడు. కాఫీ అలవాటు లేదు. ఇస్తే తాగుతాడు లేకపోతే దాని కోసం బాధపడడు. ఆయన బహుపొదుపైన మనిషి. తన బట్ట తానే ఉతుక్కుంటాడు. ఆయనకు చిన్నతనము నుంచి ఇదే అలవాటుట.

## నా స్నేహితులు

క్రొత్తవాళ్ళదగ్గర మాట్లాడటానికి శాస్త్రి గారికి చాలా భిడియం. కాని చాల పరిచయం గల మిత్రులనైతే హాస్యం పట్టిస్తాడు.

ఒకసారి ఆయనా, నేనూ కలిసి కాఫీ హొటలులో కాఫీ త్రాగుతున్నాము, మా వెనక బెంచిలో ఇద్దరు "లా" కాలేజీ విద్యార్థులు చేరి నవ్యసాహిత్యాన్ని తమ ఇష్టంవచ్చినట్లు విమర్శిస్తున్నారు. అందులో కొన్ని మృదువైన విదిలింపులు మాకుకూడా తగులుతున్నాయి. "ఏం, చూస్తారేం, జబాబు చెప్పండి" అన్నట్లు నేను ఆయన వంక చూచాను. మనకెందుకు మనము ఊరుకొందాము అన్నట్లు ఆయన నావంక చూచాడు. ఆ పెద్ద మనుష్యులు ఇద్దరూ మమ్ములను ఎరిగేఉంటారు. ఎందుకంటే వాళ్ళు ఎక్కువగా కథలనుగురించీ, హాస్యరచననుగురించీ మాట్లాడుతూ, మమ్ములను విమర్శిస్తున్నారు. కులాసాగానేఉంది కాని మాకు మాత్రము ఉత్సాహదాయకంగా లేదు. మేము బైటపడటంకంటే దాక్కొని ఉండటమే మర్యాద అని తోచింది. ఇద్దరం నవ్వుకొంటూ కాఫీ తాగుతున్నాము.

## నా స్నేహితులు

ఒక స్థితిలో నాకు కాస్త కష్టంవేసింది ఆయన నవ్వుతున్నా, నేను మెల్లిగా శాస్త్రిగారితో అన్నాను. మీరు ఇల్లాంటి మాటలు వినవలసిరావటం నేను చేసిన పొరపాటు వల్లనే అని; నాకు విచారంగా ఉంది. ఈ హోటలు యజమాని కుర్రవాడు. చిన్నా పెద్దా చూడకుండా అడ్డమైన వాళ్ళనీ రానిస్తాడు. ఎప్పుడో సమయంజూచి కాస్త చెప్పాలె, అటువంటి వాళ్ళను రానీయవద్దని !

ఈ మాటలు విని శాస్త్రిగారు చెయ్యిపట్టుకొనిలాగి కూర్చోబెట్టి, అల్లాగ తొందరపడి ఎప్పుడైనా చెప్పేరు ! వాడు అల్లాగ రానిస్తున్నాడు కాబట్టే, మనం నిర్భయంగా వచ్చాము. లేకపోతే చాలా ఇబ్బందిపడాలిసి వచ్చేది.

ఒకసారి మే మిద్దరం షికారుగా రైల్వేస్టేషను వైపు వెళ్ళాము. రైల్వేస్టేషనులోనుంచి, పట్టాలుదాటి ఆపైన ఉన్న పర్రల్లోకి వెడితే హాయిగా చల్లగాలి తగులు తుంది. అందుకని వెళ్లుతున్నాము.

స్టేషనులోకి వెళ్ళాము. ఆరుగంటల బండికి కామాలు టిక్కెట్లు ఇస్తున్నారు. అక్కడఉన్న ఇద్దరో ముగ్గురో

టిక్కెట్లు కొనుక్కొని వెళ్ళిపోయినారు. లోపలాయన పెద్దగా అంటున్నాడు "ఇంకెవ్వరి కయినా టిక్కెట్లు కావాలంటే రండి. తలుపు మూసివేస్తాను."

అయినా శాస్త్రిగారు నిర్ఘాంతపోయి "ఎట్లా?" అనుకొని గబగబా ఆ గవాక్షం దగ్గరకెళ్ళి, ఉత్తరీయం కొంగువున్న మూటను విప్పుతున్నట్లు నటిస్తూ "నాకు కూడా ఒక టిక్కెట్టు ఇయ్యండిసార్" అన్నాడు పల్లెటూరి వాడి పద్ధతిలో, ఆయన "ఎక్కడికి?" అని అడిగాడు.

ఎక్కడికి వెళ్ళటానికీ తాను ఆఖరులో నిశ్చయం చేసుకోనట్లు అమాయకంగా చూస్తూ "అయితే ఈ లైను మీద ప్రయాణంచేస్తే ఎక్కడెక్కడికి పోవచ్చునో కాస్త చెబుతారూ? అన్నాడు. ఆయన తలుపు టక్కున మూసివేశాడు. శాస్త్రిగారు నా దగ్గరకొచ్చి ఇంకా ఆ అమాయకమైన చూపుతోనే—అదేమిటండీ, కాస్త చెబితే అరిగిపోతాడా అన్నాడు. ఈ ప్రవర్తనను తలుచుకొన్నప్పుడల్లా నాకు నవ్వువస్తుంది.

నేను ఒక సారి ఆయన ఇంటికి వెళ్ళాను. ఆయనతో మాట్లాడి సాయంత్రం ఏడుగంటల బండికి వచ్చే

6

యాలని అనుకొని ఆరుగంటలకు ప్రయాణమైనాను. ఆ రాత్రి అంతా బండిలో నేగడపాలె. ఆ బండి తెల్లవారుఝామున ఏమూడుగంటలకో బెజవాడ చేరుతుంది. నిజానికి ఆరుగంటలకే భోజనం చేస్తే చేసినట్లు. లేకపోతే ఆ రాత్రికి భోజనం లేదన్న మాటే!

నేను ప్రయాణం అవుతుంటే ఆయన అన్నాడు. ఈ రాత్రికి భోజనం ఎక్కడండీ? అని అంత ఆలోచించిన వాడు భోజనం చేసి పొండి అనాలిసింది, అల్లా అనలేదు. అనక అల్లాగ ప్రశ్న మాత్రము అడిగాడు, "భోజనానికి ఏం లెద్దురూ, లేకపోతేనేం ఒకపూటకు!" అన్నాను.

"అల్లాగ ఎప్పుడూ అనుకోకండి చెబుతానురండి" అన్నాడు. ఇద్దరూ స్టేషనువైపుకు నడుస్తున్నాము. ఆయన మళ్ళీ ఇల్లాగ అన్నాడు. "ఈ వయస్సులో మీరు రాత్రిభోజనం లేకుండా ప్రయాణం చేస్తే ఎందుకూ పనికి రారు. నామాటవిని సామర్లకోటలో రైల్వేహోటలులో మీరు తప్పకుండా భోజనం చెయ్యండి" నేను ఊరుకొన్నాను.

నడుస్తున్నంతసేపూ ఆయన సామర్లకోటలో భోజన సౌకర్యాన్నిగురించి చెప్పి మీరు తప్పకుండా హోటలులో భోజనం చెయ్యండని బలవంతపెట్టాడు.

చివరకు రైలు ఎక్కుతూకూడా ఈ మాటే అని రైలు కదిలే సమయాన, "మీరు హోటలులో భోజనం చెయ్యకపోతే నన్ను చంపుకొన్నట్లే" అని ఒట్టు కూడా వేసుకొన్నాడు. ఎవరైనా తమ యింట్లో భోజనం చెయ్యమని బ్రతిమిలాడుతారు. ఈయన హోటలులో భోజనం చెయ్యమని నన్ను చాల బలవంతపెట్టాడు.

ఆయనకూడా మా యింటికి ఎప్పుడైనా వస్తూ ఉండేవారు. ఒకపూట ఉండి వెళిపోతూ ఉండేవారు. ఒక్కసారి కామాలు మూడురోజులున్నారు.

వచ్చిన రోజున భోజనం చేసి కాసేపు విశ్రమించి, సాయంత్రం మా డింటికే బయలుదేరి ఎక్కడికో వెళ్ళారు.

ఆ రాత్రి ఏవో మాటల సందర్భంలో ఆయనే అన్నారు. "పట్టాభి సీతారామయ్యగారిని ఒక పనిమీద

చూడటానికి వచ్చాను, అని, సరే ననుకొన్నాను. అంత కంటే ఎక్కువగా నేను ఆయనను ఏమీ అడగలేదు.

మరునాడు కాఫీ తాగిన తరువాత "నాకు ఒక దస్తా కాయితాలూ, ఒక పెన్సలూ గబ్బరు కావలె బజారుకు పోయి కొనుక్కొని వద్దామా! అన్నాడు.

కాయితాలు చవుకగా దొరికేరోజులవి. ఈ మాత్రానికి బజారుకెందుకు లెండి. నా దగ్గర ఉన్నవి, ఇస్తానని తెచ్చి యిచ్చాను.

"నేను ఒకగదిలో కూర్చుని జాగ్రత్తగా ఆలోచించి వ్రాయాల్సిన పని ఉంది. నాకు అటువంటి సదుపాయం ఇక్కడ ఏమైనా ఏర్పరిస్తే చాలా సంతోషిస్తాను" అని అన్నారు ఆయన.

నేను మా ఆవిడను బ్రతిమిలాడి నచ్చచెప్పి, పడక గది ఖాళీ చేయడానికి ఒప్పించాను. అదేమంత కష్టమైన పనికూడా కాదు. టేబిలూ పట్టెమంచం తీసి వేసి దక్షిణ వైపు కిటికీవద్ద, నా కుర్చీ వేశాను. ఆ చిన్న మార్పుతో అది శాస్త్ర చదువుల గది అయిపోయింది పడకగది అల్లా!

"వారు ఇంకొక రోజో—రెండు రోజులో ఉంటారు. ఈ రెండు రోజులూ పిల్లలూ మనము క్రిందే పడుకొం దాము!"—అన్నాను మా ఆవిడతో, ఆవిడ మూతివిరిచి "అవ్వ, ఏం పనండీ ఇది" అన్నది. "ఏం చేస్తాము మరి తప్పదు" అని నే నన్నాను.

ఆయనకు ఆ గదిలో ప్రవేశ పెట్టాను. ఒక కూజాలో మంచి నీళ్ళుకూడా పెట్టించి పిల్లల నెవ్వరినీ పైకి పోవద్దని కట్టుదిట్టం చేశాను.

పెనసలు చెక్కుకుంటానికి ఒక చాకు అయినా బ్లేడు అయినా కావాలంటే, చాకు ఉంటే ఇచ్చాను,

ఆయన రోజు రోజు అంతా క్రిందికి రాలేదు. కాఫీ వేళకు పైకి పంపే వాళ్ళం, భోజనానికి మాత్రం వచ్చి రెండు మెతుకులు తిని మళ్ళీ వెంటనే మేడపైకి వెళ్ళే వాడు. సాయంత్రం మాత్రం ఇద్దరం షికారు వెళ్ళే వాళ్ళం..

ఏమిటండి ఇంత శ్రద్ధగా వ్రాస్తున్నారు ? అని నేను ఆయనను అడగ లేదు, అడగ వలెనని కుతూ

హాలం ఉండేది కాని మన కెందుకని ఊరు కొన్నాను. అదేదో కథగాని నవలగాని, నాటకంగాని అయితే నాకు చదివి వినిపిస్తారు. మరో విషయం అయితే అడిగినా లాభం ఉండదు.

ఆ రాత్రి కూడా ఆయన గదిలో దీపం చాలా సేపు వెలిగింది. ఆయన ఏ ఒంటి గంటకో పండుకొని ఉంటాడు.

తెల్ల వారింది. ఏడుగంటల కల్లా కాఫీ తయారైంది. కాఫీ పైకి పంప మన్నారా అని కబురు చేశాను. “ఆయనే క్రిందికి వస్తారట” అని చెప్పింది. కబురు తీసి కెళ్ళిన పని మనిషి.

ఆయన అప్పటికే స్నానంచేసి మంచి బట్టలు వేసుకొని కూర్చున్నాడు. అదీ, ఇదీ మాట్లాడు కొన్నాము. కాని ఆయన ఏం వ్రాస్తున్నాడో నాకు చెప్ప లేదు. అంత రహస్యంగా ఉంచాడు.

స్నేహితులం కదా, తను ఏమి వ్రాస్తున్నదీ నాకు చెప్పలేదే. అని నాకు కాస్త కష్టం వేసింది. ఏదో

కథ వ్రాస్తున్నానయ్యా అని మాట మాత్రం అంటే సంతోషించేవాణ్ణిగా! ఆయన ఆ సంగతే ఎత్తలేదు పైగా ఏమన్నా డంటే, "నేను బహుశా సాయంత్రం బండికి వెడతాను" అని.

మీరు వ్రాస్తున్నది అయిందా? అన్నాను. అప్పుడైనా గ్రహించి, అయింది మీకు చదివి విని పిస్తానని అంటారు అనుకొన్నాను. ఆయన అల్లా, అనక, ముభావంగా, 'చాలావరకు అయింది లెండి అన్నాడు. నాకు కష్టం వేసింది.

పైగా ఆయన సాయంత్రం వెళ్ళి పోతున్నాడు. కూడా, నాకు ఆ విషయం తెలిసే అవకాశం ఏమీ లేదు.

అందుకని నేనే ఆయన వెంట పైకి వెళ్ళాను. బల్లకు ఒక వేపున నేనూ, రెండో వైపున ఆయనా కూర్చున్నాము. కాయితాలు అక్కడే ఉన్నవి. ఏ విషయమై వ్రాస్తున్నాడో తెలిసికోవలెనన్న కుతూహలంతో ఆ కాయితాల వంక చూశాను.

చూచే చూడటంతోనే ఒక్క విషయం మాత్రం తెలిసి పోయింది. ఆయన వ్రాస్తున్నది కథ మాత్రము కాదు. ఎందుకంటే, ఆ కాయితాల మీద ఏవో అంకెలూ పేర్లూ అవీ ఉన్నవి.

ఏదో పబ్లిషింగ్ కంపినీ స్థాపించే స్కీము తయారు చేస్తున్నట్లుంది. ఏయే పుస్తకాలు ఎవరెవరిచేత వ్రాయించాలో జాగ్రత్తగా ఆలోచించి ఆ పేర్లు అన్నీ శాస్త్రిగారు వ్రాసినారు.

నేను ఇల్లాగ ఆ కాయితాల వంక చూస్తూఉంటే ఆయన వాటిని గబుక్కున లాక్కొని దాచి వేసినట్లయితే నాకు చాలా అవమానం అయ్యేది, కాని ఏమీ అనలేదు. ఎట్లాగూ చూశాడు గదా, విషయము అంతా విపులంగా చెప్పేద్దాము అని అనుకోనూ లేదు. మెదలకుండా ఊరుకొన్నాడు.

నన్ను ఆప్తునిలాగ చేరదీసి, ఆయన రహస్యాలు నాకు చెప్పలేదని నేను కాస్త ఇదైనాను.

ఉండబట్టలేక చివరకు నేనే అన్నాను: ఏమండీ ఏదైనా పబ్లిషింగ్ హౌస్ స్థాపిస్తున్నారా?

ఈ ప్రశ్న నేను అడిగినా, ఆయన ముఖంలో ఏ మార్పూ కలుగ లేదు, ఊరికే అవుననట్లు తల ఊపాడు.

నాకు అక్కడ ఉండాలనిపించ లేదు, ఆయన నాకు సరిగా సమాధానం చెప్పటం లేదు. ఏదో తీవ్రమైన ఆలోచనలో ఉన్నాడు, అందుకని క్రిందికి వచ్చివేశాను.

ఆ సాయింత్రం ఆయన వెళ్ళిపోలేదు. అసలు ఆయన క్రిందికే రాలేదు, ఆయన ఒక పబ్లిషింగ్ హౌస్ స్థాపించి అపూర్వమైన సారస్వత సేవ చేయ ప్రయత్నిస్తున్నాడు. సమర్థుడు ఎంతపని అయినా చేయగలడు.

కాని ఆయన ఎవరెవరిచేత ఏమి పుస్తకాలు వ్రాయిస్తాడో తెలుసుకొందామన్న కుతూహలం ఆపుకోలేక పోయినాను. ఆయన మరునాడు ప్రొద్దున్నే స్నానానికి వెళ్ళినపుడు మెల్లగా, దొంగలాగ ఆ గదిలోకి వెళ్ళాను ఆ కాయితాలు చూద్దామని, చేసేది దొంగపని. అందుకని భయం గానే వెళ్ళాను.

అయితే ఆ కాయితాలు అక్కడ లేవు వాటిని ఆయన పెట్టెలో పెట్టుకొని, పెట్టెకు తాళంవేసి తాళం చెవి బొడ్లో కట్టుకొని వెళ్ళాడు.

అప్పటి నుంచి, ఆ కాయితాల్లో ఏదో రహస్యం ఉండబట్టే అల్లాగ దాచుకొన్నాడని, అదేమిటో తెలుసుకోవాలెనని కుతూహలం ఎక్కువైంది.

ఆ తరువాత కాసేపటికే అల్లాంటి సదవకాశం, నాకు లభించింది, ప్రొద్దున్న ఎనిమిది గంటలవేళ, ఎవరో స్నేహితుడు వచ్చి ఆయనను క్రిందికి పిలిచి, మాట్లాడుతూ బజారుదాకా తీసికెళ్ళాడు.

వీధి తలుపు గొళ్ళెంపెట్టి నేను గబగబా పైకి వెళ్ళాను. ఆ కాయితాలూ తీసిచూశాను. నేను అనుకొన్నదే. ఒక పబ్లిషింగ్ సంస్థ స్థాపిస్తున్నాడు. ఆ సంస్థకు మూలధనం షేర్లు సంపాదిస్తాడు. ఎవరెవరికి ఎన్ని షేర్లు ఇవ్వాలిసిందీ అందులో ఉంది. కొన్ని పేర్లు ఉన్నాయి. ప్రతి పేరుకూ ఎదురుగా ఆయన కొనే షేర్ల సంఖ్య ఉన్నది. అవన్నీ ధనవంతుల పేర్లు. నా పేరు

లేదు. నేనేమీ ధనవంతుణ్ణి కాదు. నాకు కూడా ఒకటి రెండు పేర్లు అంట గట్టాలని ఆయన అనుకోక పోవటం నాఅదృష్టమే అనుకొన్నాను.

ఆ కాయితాలనుబట్టి చూస్తే ఆయన రాజకీయ, సాంఘిక, మతైక, ఆర్థిక సంగీత, సాహిత్య విషయము లను గురించే కాకుండా, సమస్తవిషయములను గురించి పుస్తకాలు వ్రాయించి అచ్చు వేయించేటట్టున్నాడు, లిస్టు చూస్తే అల్లాగ కనపడు తున్నది.

ఆ కాయితాల్లో ఇంకా రహస్యమైన విషయాలు చాలా ఉన్నవి. ఒక్కొక్క శాఖకు ఒక్కొక్క జనరల్ ఎడిటర్ నియమించారు శాస్త్రిగారు. ఇంకా ఒక్కొక్క శాఖలో వివిధ విషయాలను తీసుకొని, ఏ విషయాన్ని గురించి, ఎవరెవరు ఏ పుస్తకాలు వ్రాయాలో ఆ వివరాలన్నీ అందులో ఉన్నవి.

సారస్వత విషయాలకు మొత్తంమీద శివశంకర శాస్త్రిగారు జనరల్ ఎడిటర్. మళ్ళా అందులో కథా వాఙ్మయానికి శ్రీ చింతా దీక్షితులుగారు ఎడిటర్. ఇది చూచేసరికే నామనస్సు చివుక్కుమంది.

దాని తరువాత ఎవరెవరి కథలు ప్రచురించ వలసి ఉన్నదో, ఆ పట్టీ ఉన్నది. అది ఇల్లాగ ఉంది. చలంగారివి పది వాల్యూములు దీక్షితులు గారివి.

| | |
|---|---|
| శివశంకర శాస్త్రిగారివి | 4 |
| నోరి నరసింహశాస్త్రిగారివి | 2 |
| శ్రీపాదవారివి | 8 |
| కొడవటిగంటివారివి | 1 |

ఈ లిస్టులో కూడా నా పేరు కనపడక పోయేసరికి, ఆ కాయితాలు అక్కడే పెట్టి క్రిందికి దిగి, వీధి తలుపు భార్లాగా తీసి నేను వంట యింట్లోకి వెళ్ళాను. ఆవిడతో కాసేపు ఏమైనా కబుర్లు చెప్పుకొందామని.

ఆ తరువాత పది నిముషాలలో ఆయన వచ్చి, నాతో మాట్లాడటానికి సమయు లేనివాడిలాగ చూస్తూ, గబ గబా పైకి వెళ్ళిపోయినాడు. ఆ వెళ్ళటం వెళ్ళటం పదకొండు గంటలదాకా క్రిందకి రాలేదు. పదకొండింటికి వచ్చి చాలా తొందరగా భోజనం చేసి, "ఆపని పూర్తి

చేసుకొని వెళ్ళాలని ఉన్నాను. సాయంత్రం బండికి తప్పక వెళ్ళిపోవాలె. ఈ లోపల బహుశః పూర్తికావచ్చు. వెడ తాను" అంటూ పైకి వెళ్ళాడు.

మధ్యాహ్నం విశ్రాంతికూడా తీసుకోకుండా పని పూర్తిచేసినట్టున్నాడు ఎందుకంటే మూడుగంటలకు కాఫీకి వచ్చినపుడు, చాలా ఉత్సాహంగానూ ఉన్నాడు. ఎంతో బరువు క్రిందికి దింపేసినట్లుగానూ, ఫీలు అవుతున్నట్లున్నాడు.

కాఫీ తాగాము. మామూలుగానే తాను ఒక్కడే పైకి వెళ్ళక, రండి వెడదామని నన్ను తీసికెళ్ళాడు.

నేను అప్పుడే అనుకొన్నాను. ఈయన బహుశః నాకు ఆ స్కీముఅంతా చూపిస్తాడని. నేనేమీ సంతోషించే విషయంకాదది. నాపేరు అందులో లేదాయె. అందరి కథలు ఆయన ప్రచురించ తల్చుకొని. నా కథలు ఆ లిస్టులో చేర్చకపోయె! ఎందుకు చేర్చలేదంటే ఏమంత బాగుంటుంది. నా కథలు ఆయన ప్రచురణలలో చేరతగినంత ఉత్తమమైనవి కావన్నమాట!

విచారంగానే మేడమెట్లు ఎక్కాను.

ఇద్దరం గదిలోకి వెళ్ళాము. ఆయన నవ్వుతూ ఆ కాయితాలకట్ట నాకిచ్చినాడు. ఇదివరకు కొంతవరకు నేను దొంగతనంగా చూచిందే అయినా, ఇప్పుడు మళ్ళీ చూచాను.

దస్తాకాయితాలు అరటావుసైజులో ఉన్నవి. కాయితం రెండువైపులా వ్రాశారు. ఇప్పుడు చూస్తే ప్రచురణశాఖలు మరికొన్ని ఎక్కువ అయినయి. జ్యోతిశ్శాస్త్రము, తర్కము, వేదాంతము, మొదలగు శాస్త్రవిషయములను గురించి కూడా పుస్తకాలు ప్రచురణచేసే ఏర్పాట్లు చేశారు.

ఇంత పెద్ద పుస్తక ప్రచురణసంస్థ మన ఇండియాలో ఎక్కడా లేదు. విదేశాలలో ఇల్లాంటి సంస్థలు ఏ ఫక్కీమీద నడుస్తున్నవో, అల్లాంటి ఫక్కీ ఒకటి తయారుచేశారు.

ఈ స్కీము తయారు చేయుటానికి ఆయన రెండు సంవత్సరాలనుంచీ ఆంగ్లంలో వున్న గ్రంథాలు చదువు

తున్నాడు, స్కీములను తయారుచేసే పద్ధతులను తెలిపేవి దాని తరువాత పెద్ద పెద్ద 'పబ్లిషిగ్ హౌస్' లలో గ్రంథప్రచురణ ఎట్లా జరుగు తున్నదో తెలుసుకొంటానికి మరికొన్ని పుస్తకాలు చదివాడు. ఇంత విజ్ఞానంతో ఈ స్కీమును తయారుచేశాడు.

నిజంగా ఇదిగనుక సెగ్గిందా, మన దేశానికి గొప్ప ఉపకారం జరిగింది అన్నమాటే దేశంలో విజ్ఞానం వెదజల్ల బడుతుంది. ఆయన చేసిన ఏర్పాటులన్నీ బహు చక్కగా ఉన్నవి. ఈ పుస్తకాలన్నీ అమ్మటానికి పుస్త కాల షాపులు, పెద్ద పట్టణాలలో ఈ పబ్లిషింగ్ వారో పెట్టాలని ఆయనసూచించాడు.

ఈ పుస్తకాలు ప్రచురించటానికి ఒక పెద్ద ప్రెస్, ఆ ప్రెస్‌కు కావలసిన ఇంగ్లీషు, తెలుగు అరవ అక్ష రాలను పోతపొయ్యటానికి ఫౌండరీ కావాలని ఆయన వ్రాశారు.

ఈ విధంగా అన్నీ ఏర్పాటులుచెయ్యటానికి పవర్ ప్రెస్ కొంటానికీ, ఎంత అవుతుందో లెక్కవేశారు.

పనులన్నీ అనుకొన్నట్లు జరిగితే ఇంటికి, గుమాస్తాలకు, నౌకర్లకు ఎంత వ్యయం చెయ్యాలో అంతా వివరించారు. ఒక్క మాటలో చెప్పాలంటే, ఏ చిన్న విషయాన్నీ ఆయన వదలివేయ లేదు. అందులో చెప్పినట్లు కళ్ళుమూసుకొని చేసుకుపోతే, పని జయప్రదంగా జరిగిపోతుంది.

"ఇది ఇల్లాగ తయారుచేయాలని రెండు నెలలనుంచీ ప్రయత్నం! గుంటూరిలో వెంకటరత్నంగారింట్లో ప్రయత్నంచేశాను. ఊహ కుదర లేదు."

నావంక చూశారు శాస్త్రిగారు. నేను నవ్వాను.

"బెజవాడ సత్యనారాయణగారింట్లో కూర్చుని ప్రయత్నించాను. పెగలేదు."

నేను మళ్ళీ నవ్వాను.

"ఇది మూడో ప్రయత్నం మీయింట్లో పని అంతా పూర్తిఅయింది."

మన ఆంధ్రదేశానికి ఒ[illegible] చేని వలననైతే జరగబోతున్నదో, గ్రంథ ప్రచురణ విష





యంలోనూ, గ్రంథనిర్మాణంలోనూ, గ్రంథవిక్రయ పద్ధతిలోనూ, దేనివలన ఉపయోగకరమైన విప్లవం రాబోతున్నదో అట్టి మహత్తరమైనస్కీము మా యింట్లో తయారైందిగదా అని నేనుకొద్దిగా గర్వపడి, సంతోషంగా ఆయనవంక చూశాను. ఆయనా నన్ను అభినందిస్తున్నట్లుగా చూశాడు.

నేను సంతోషమును తెలియపర్చి మీయత్నం విజయవంత మగుగాక అని నా దీవనలిచ్చి. కాయితాలు మళ్ళీ ఆయన చేతికియ్యబోయినాను.

ఆంధ్రావనికి జరుగబోతున్న ఈ మహోపకారంలో నా చెయ్యికూడా పడలేదన్న విచారంమటుకు నన్ను బాధిస్తూనేవుంది.

నేను కాయితాలు ఇయ్యబోతే ఆయనపుచ్చుకోక "చివరదాకా చూడండి" అన్నాడు శాస్త్రి గారు.

చూశాను.

చివర చూడండి.

చివరచూశాను. అక్కడ నేను చూడని విషయాలున్నమాట నిజమే. పాఠ్యగ్రంథ ప్రచురణ శాఖ అది.

ఆ శీర్షిక క్రింద ఇంగ్లీషు, తెలుగు, అరవంలో హిస్టరీ, జాగ్రఫీ, సివిక్సు మొదలగు, ఎన్నో విషయాలనుగురించి అన్నిక్లాసులకు ఎవరెవరు పుస్తకాలు వ్రాయాలో వ్రాసిఉంది.

అందులో హిస్టరీ డిపార్టుమెంటుకు జనరల్ ఎడిటర్ శ్రీ వెంకటరంగయ్యగారు. అందులో నాలుగు అయిదుక్లాసులకు ఫస్టుఫారం మొదలుసిక్సుఫారంవరకును హిస్టరీ పుస్తకాలన్ని వ్రాయవలసిన గ్రంథకర్త పేరు ఉంది. అది నేను, నాకుచాలా ఆశ్చర్యం కలిగింది. సంతోషమూ కలిగింది.

'అయితే నేనూ ఉన్నానే!' అన్నాను.

మీరు అన్నిక్లాసులకు హిస్టరీ పుస్తకాలు వ్రాయాలె.

'మీరు స్కూలులో చాలాకాలంనుంచి చరిత్ర చెపుతున్నారు. వ్రాయగలశక్తిఉంది వ్రాయండి'

నేను నవ్వి ఊరుకొన్నాను. నిజం మాటకు లోపల చాల సంతోషంగా ఉన్నది.

ఆయన మళ్ళీగంభీరంగా ఇల్లా అన్నాడు 'మీరు అన్నిక్లాసులకు వ్రాయగలరా?'

ఏం ? అట్లా అడుగుతున్నారూ?

"అంటా మీరు వ్రాయలేరనికాదు. అట్టేవ్యవధి లేదు. అయిదారు నెలలలో ఈపుస్తకాలన్నీ వ్రాయటం పూర్తికావాలె. అందుకని అడుగుతున్నాను. మీరు ఒక్కరూ వ్రాస్తే శ్రమఎక్కువ.

నేను ఆలోచిస్తూ ఊరుకొన్నాను. ఆయనమళ్ళీ ఇల్లాగ అన్నాడు. "ఎవరైన మీకు సాహాయ్యము కావాలంటే, ఇస్తాము, మీకు ఇష్టమైనవారి పేరు చెప్పండి, వేస్తాము. అయితే ఒకటి ఆ పుస్తకాలకై ఇచ్చేడబ్బు మీరు ఇద్దరూ పంచుకోవలసివస్తుంది ఆలోచించండి" అన్నారు.

'డబ్బు ఇస్తారా ఏమిటండీ వీళ్ళందరికీ' అని నేను ఆశ్చర్యపోతూ అడిగాను.

ఇది వట్టి తెలివితక్కువప్రశ్న అని ఆయన అనుకొన్నట్లు ఆయనచూచిన చూపువల్ల తెలిసింది.

'డబ్బుఇచ్చేపద్ధతి కాకపోతే!!' గచయితనుమాడ్చి, పబ్లిషర్ బాగుపడే పాడుఅలవాటు మనదేశంలో తప్ప ఎక్కడా లేదు''

ఈమాట నిజమా అబద్ధమా అని అడుగుతున్నట్లు నావంక చూశాడు.

నేను నిజమేనన్నాను.

'గ్రంథకర్త బాగుపడాలె. పబ్లిషర్ బాగుపడాలె. ఏమంటారు?' అన్నాడు.

నిజం, నిజం అన్నాను. నేను.

ఆయన కాయితాలూ మడతపెట్టి పెట్టిలో పెట్టాడు. నేను అడిగాను. 'అయితే ఇది వ్రాసినందుకు ఏమాత్రం ఇస్తారు?'

ఇంగ్లాండులో పేజీకి ఇంత అని యిస్తారు. నేనూ అల్లాంటి ఏర్పాటుచేశాను. అయితే వాళ్లుయిచ్చినంత ఎక్కువగా మనం ఇయ్యాలేము. వాళ్లపుస్తకాలు లక్షల మీాద అమ్ముడుపోతవి. అయినా పేజీకి రూపాయికంటే కొంచెం ఎక్కువే ఇయ్యవలెనని నా ఉద్దేశం.

నేను అన్ని క్లాసులకు పుస్తకాలు వ్రాస్తే ఎంత వస్తుందా అని మనస్సులో లెక్క వేసుకొంటున్నాను. ఇది ఆయన కని పెట్టి 'మీకు రెండు వేలకు తక్కువ రాదు. ఇంకో నాలుగైదు వందలు ఎక్కువే రావచ్చు'

ఇంత డబ్బు ఒక్కసారిగా ఆయిదారు నెలల్లో వస్తుందంటే నాకు సంతోషం కలిగింది. కాని సందేహమూ కలిగింది.

నాకు ఇంత డబ్బు మీరు ఇయ్యగలరా! అన్నాను. ఆయన విరగబడి నవ్వి, నేను ఇచ్చేదేమిటయ్యా మా కంపెనీ ఇస్తుంది.

రెండువేలు ఒక్కసారిగా ఇస్తారా అని అడిగాను అమాయకంగా.

అంటే పుస్తకాలన్నీ ప్రింటు కావటంతోనే ఇస్తాము'' అన్నారు శాస్త్రిగారు.

నేనన్నాను. అంహుం. పుస్తకాలు అచ్చు కావటం చాలా ఆలస్యం కావచ్చు. అందాకా కనిపెట్టుకొని ఉండటం నాకంత ఇష్టంగా లేదు. అదీకాక నాకు డబ్బు అవసరంగా కూడా ఉన్నది.

అయితే ఒకటి చెయ్యండి, పుస్తకాలు వ్రాత ప్రతులు కంపెనీవారికి అందజేయటంతోనే మీకు డబ్బు యిచ్చే షరతులు మాట్లాడుకోండి.

"ఎవరితో మాట్లాడుకోవాలె ?"

"కంపెనీ డైరెక్టర్లతో."

ఈ మాట వినేసరికి ఉత్సాహం నాకు సగం చచ్చింది. ఎవరితోనో మాట్లాడుకోవాలెట. వాళ్ళు ఒప్పుకొంటారో ఒప్పుకోరో !

శాస్త్రి దిగులుగా అన్నాను. "అయితే ఇదంతా మీ స్వంతం కాదన్నమాట ! వాళ్ళు ఎవరో ఉన్నారంటున్నారు. వాళ్ళు నాకు అసలు రెండు వేలు ఇస్తానంటారా ?"

"నేను చెప్పి ఇప్పిస్తానయ్యా, నామాట సాధారణంగా తీసివేయరు !"

"తప్పకుండా చెప్పి ముందుగా ఇచ్చే ఏర్పాటు చేయండి" అన్నాను.

ఆయన సరే నన్నట్టు తల ఊపి "తొంభైతొమ్మిది పాళ్ళు నా మాట వింటారు. తప్పక మీకు ఈ ఏర్పాటు చేస్తాను, అన్నాడు.

రెండువేల రూపాయలూ ఒక్క సారిగా నేను కళ్ళ జూడటం నిజంగా అదృష్టమే! శాస్త్రిగారు నా యందు చూపు తున్న ఆదరణకు అభిమానానికి సంతోషించాను.

"అయితే కంపెనీకి మూలధనము ఎంత పోగుఅయిందండీ" అని అడిగాను.

ఆయన నిదానంగా తల ఊపి ఊరుకొన్నాడు.

"ఈ వ్యాళ్ళో సీతారామయ్యగారిని చూడటానికి వచ్చారు అందుకనేనా ?

"అవును"

"చూశారా ?"

"నిన్నా మొన్న ఆయన గుమ్మందాకా వెళ్ళాను. కాని లోపలికి వెళ్ళటానికి భిడియపడ్డాను" అన్నాడు.

ఇంత భయపడే మనిషి, షేర్లు ఏమి అమ్మగలడు ధనమేమి సంపాదించగలడు !—అని అనుకొన్నాను.

కాని రెండువేల రూపాయలు యిచ్చే కంపెనీ అసలే ఏర్పడదు అని నేను మనస్సులోనైనా అనుకొంటానికి బుద్ధి పుట్టలేదు.

శాస్త్రిగారు ఆరోజు సాయంత్రం ప్రయాణమైనారు. రైలులో కూర్చున్న తరువాత ఆయనమళ్ళీ అడిగారు. "ఆ ఎనిమిది హిస్టరీ పుస్తకాలూ మీరు ఒక్కరే వ్రాస్తారా?"

"ఇంకొకరిని జత తీసుకొంటే, వాళ్ళకు ఒక వెయ్యి ఇయ్యాలె. నేనే రాత్రింబవళ్ళు కష్టపడి వ్రాస్తాను" అన్నాను.

"సరే, మీ యిష్టం" అన్నాడు ఆయన.

బండి కదిలింది. నేను శాస్త్రిగారికి షేక్‌హాండ్ ఇచ్చి, "మీరూ, ఆ రెండువేల రూపాయలూ ఒక్కసారిగా యిచ్చే ఏర్పాటు చేయించాలె! అని బ్రతిమిలాడే పద్ధతిలో అన్నాను.

ఆయన సరే అన్నట్లు చూచాడు.

నేను ఇంటికి వెళ్ళి మా ఆవిడతో చెప్పాను. అతిథి వెళ్ళిపోయిన సంగతి ఆవిడ విని ఊరుకొంది.

"ఆయన నన్ను హిస్టరీ పుస్తకాలు వ్రాయమన్నాడు. బహుశ రెండు వేలన్నా వస్తవి. ఇంకా శాస్త్ర ఎక్కువే రావచ్చు." సంతోషం పట్టలేక.

ఆవిడ "ఇంకేం నాకు చంద్రహారం తప్పదు." అన్నది.

కంపెనీ దగ్గరనుంచి, పుస్తకాలు వ్రాయమని ఆర్డరు, కొంత ఎడ్వాన్సు వస్తుందని ఎంత కాలం చూచినా రాలేదు.

చివరకు ఒక రోజున ఒక వి. పి. పార్శిల్ వచ్చింది. ఏమిటో నని ఆ వి. పి. పార్శిల్ తీసుకొన్నాను. అది మరేమీ కాదు. శాస్త్రిగారు వ్రాసిన స్కీము అంతా అచ్చు అయింది. ప్రెస్‌వారే నా పేర రెండు రూపాయలకు వి. పి. కట్టారు. వాళ్ళు నా పేర ఒక కాపీ ఎందుకు వి. పి. కట్టారో తెలియలేదు.

దాని తరువాత ఆయన కనపడ్డా ఈ సంగతినిగురించి వివరాలు చెప్పలేదు. మొత్తంమీద ఆయన అనుకొన్న పని సాగలేదు. ఎవ్వరి దగ్గరకూ వెళ్ళలేదు ఆయన పేర్లు అమ్మటానికి! స్కీము మటుకూ అచ్చు కిచ్చాడు. అచ్చు వేసిన వాళ్ళు ఆ స్కీములో ఎవరిపేర్లు ఉన్నవో వాళ్ళందరికీ, తలో కాపీ వి. పి. చేసి, అచ్చు ఖర్చు రాబట్టుకొన్నారు. ఇది జరిగిన సంగతి.

ఇది పన్నెండేండ్ల క్రిందట జరిగిన విషయము. శాస్త్రి గారు అప్పుడు అనకాపల్లిలో ఉండేవారు, ఈ పబ్లిషింగ్ హౌస్ స్కీము కాక, ఇంకా ఇల్లాంటివి రెండో మూడో తయారు చేశారు. కాని ఒకటీ అక్కరకు రాలేదు. ఆయన నిరుత్సాహ పడలేదు. ఎల్. టీ ప్యాసు అయి మా వూళ్ళోనే అరవై రూపాయిల మీద టీచరు అయినాడు.

ఇప్పటికీ ఆయన కావాలంటే ఎవరికైన స్కీములు తయారుచేసి పెడుతూఉంటాడు. ఆపని లేనప్పుడు. కథలూ, నవలలూ, ఏకాంకికలూ, వ్రాస్తూ ఉంటారు. ఇప్పుడు ఈయన మా యింటికి సమీపంలోనే ఉన్నారు. రోజూ కలుస్తూ ఉంటాము.

---

## ౨

శ్రీ శాస్త్రిగారిలాగే......కృష్ణారావుగారు మా యింటికి తరుచుగా వస్తుంటారు. ఆయన ఎం. ఏ. ప్యాసు అయినాడు.

ఆయన సైకో ఎనలిస్టు. ఒకరి ప్రవర్తనను విమర్శించటంలో అఖండుడు. తన ప్రవర్తనను తాను విమర్శించుకోలేడు. ఎవరైనా నాలుగు రూపాయలు ఆయన వద్ద అప్పుగా తీసికొని ఇయ్యటం మరచి పోతారనుకోండి. ఈయన సైకో ఎనాలిసిస్ దృష్ట్యా ఏమంటాడు అంటే, అప్పు తీసికొన్నప్పుడే ఆయనకు ఆ అప్పు ఎగగొట్టాలనే ఉద్దేశం కలిగిందనీ, అది ఆయనకు తెలియకుండా అంతఃకరణలో దాగి ఉన్నదని అంటాడు. ఇది ఎవరికైనా కోపం వచ్చేమాట!

సైకో ఎనాలిసిస్ సత్యాలు చెప్పటంవల్ల చాలా పోట్లాటలు వస్తాయి. అల్లాంటి విషయాలు ఎవరి దగ్గర బడితే వాళ్ళ దగ్గర అనవద్దని ఆయనకు మేము చెబుతూ ఉంటాము.

ఏ విషయాన్ని గురించి అయినా సలహా అడిగితే మహా చక్కని సలహా ఇస్తూ ఉంటాడు. ఒకసారి నేనూ, కృష్ణారావుగారూ, కవిగారూ కూర్చుని మాట్లాడుకొన్నాము—

మా కవిగారికి పుస్తకం ఏదైనా వ్రాసి ఎవరికైనా యిచ్చి సన్మానం పొందాలని బహు కోరికగా ఉండేది. ఈ సంగతి కిష్టయ్యగారితో చెబితే, ఆయన ఇల్లా అన్నాడు.

“కృష్ణదేవరాయల కాలంలో కవులు, కావ్యాలు వ్రాయడమూ సన్మానాలు పొందటమూ ఉండేది. ఇప్పుడెవరండి అంకితం తీసికొనేది? మీ కెందుకూ సందేహం! ఒకసారి ఒక కవి ఒక సినిమా డైరక్టరును చూడటానికి వెళ్ళాడు. ఆయన ఒంటరిగానే ఉండి కవి గారికి నమస్కరించి కూర్చో పెట్టాడు. వచ్చిన పని ఏమిటో సెలవియ్యండి అన్నాడు. కవిగారు సంతోషించి, ‘అయ్యా సినిమాకు ఉపయోగించే కథ ఒకటి, మాటలూ, పాటలతో సహా, వ్రాసి తెచ్చానండి నేను, తమరు చూస్తే

సంతోషిస్తానని అంటూ ఆ పుస్తకం ఆయన ముందు పెట్టాడు.

డైరెక్టరుగారు అల్లాగే చూస్తాను అని సిగరెట్టు వెలిగించి, తన ముందున్న రైల్వేగైడు తీసి ఒక్కొక్క పేజీ తిరగేస్తూ, చాలసేపు గడుపుతున్నాడు. కవిగారు ఏమనుకొన్నారంటే, వారు ప్రయాణం ఏమైనా పెట్టుకున్నారేమో. ప్రయాణ సౌకర్యాలు అవీ చూచుకొంటున్నారు అని. చివరకు డైరక్టరుగారు పకపకా నవ్వుతూ కవితో అన్నాడు, 'కవిగారూ, చాలావరకు చదివాను, కథ బాగానే ఉంది కాని టెంపో లేదు, చూశారూ కథలో హఠాత్ జన్యమైన కార్య కలాపం ఏమీ లేదు చూచినంత వరకు బాగానే ఉంది. రేపు ఒకసారి రండి చూస్తాను' అని వెర్రిగా నవ్వి తూలుతూ వెళ్ళిపోయినాడు రైల్వేగైడు అరగంట సేపు తిరగేసి; కథ బాగుండనటంలో ఉండే స్వారస్యం కవికి అర్థంకాక తికమకలై వెళ్ళిపోయినాడు. ఇటువంటి కాలము ఇది మీరు ఎవరికి అంకితం ఇస్తారూ?'

"ఏ జమీందారుకైనా ఇస్తే?" అన్నాడు కవి.

జమీందారులు మీ కావ్యాన్ని అంకితం పుచ్చుకొంటారుటండీ? వారికి కుక్కలమీద ఉండే ప్రీతి మనుష్యుల మీద ఉండదు.

"నటులు ఈ రోజులలో వేలకు వేలు సంపాదిస్తున్నారు. ఎవరైనా గొప్ప నటుణ్ణి పట్టుకొంటే మనకు కావలసిన సాహాయ్యం చేయడా?" అని నేను అందించాను. కిష్టయ్యగారికి ప్రపంచం పోకడలు బాగా తెలుసు. ఈసలహాను కూడా ఆయన ఆమోదించలేదు. తాను చూచిన విషయాన్ని ఈ విధంగా చెప్పాడు. తన ఎదటే జరిగినదట ఈ చిత్రము.

"ఒక ప్రసిద్ధ నటుడి దగ్గరకు ఒక కవి వచ్చి తాను వ్రాసిన నాటకాన్ని చదివి వినిపిస్తా నన్నాడు. అది ఆయనకు ప్రదర్శన యోగ్య మని తోచి తీసుకొని తన కేమైనా ఇస్తాడేమో నని కవిగారి ఆశ.

నటుడు భోజనం చేసివస్తాను కూర్చోండి అన్నాడు. కవిగారు కూర్చున్నాడు. ఆయన భోజనం చేసీ, చేసీ గంటకు

వైటరు వచ్చాడు. కవి ఓపిగ్గా కూర్చున్నాడు. వచ్చి, ఏమన్నాడు అంటే కవిగారూ మిమ్ములను చాలాసేపు కూర్చోబెట్టాను. రండి చదువుదురు గాని మనము పడక గదిలోకి వెడదాం ఇక్కడ కూర్చుంటే ఎవరైనా వచ్చి మాట్లాడిస్తారు" అన్నాడు. కవి సంతోషించి ఆయన వెంటే గదిలోకి వెళ్ళాడు.

ఆ ప్రసిద్ధ నటుడు మంచంపైన ఉన్న తెల్లని పక్కపై పడుకొన్నాడు. చల్లగాలి కూడా వీస్తూ ఉంది. ఒక్క సిగరెట్టు పీల్చి, "అయితే కవిగారూ ఈ కావ్యాన్ని నాకు చదివి వినిపించటంవల్ల తమరు ఏమి లాభమును వాంఛిస్తున్నారో కాస్త చెప్పండి" అన్నాడు.

ఈ నాటకం బాగుంటే, తమరు దానిని ప్రదర్శించి నాకు వెయ్యినూట పదహారులు ఇయ్యండి అని ముందుగానే అడగటం బాగుండదని అనుకొని వినయంగా అన్నాడు. "పెద్ద లాభము పొందాలని నేనేమీ కోరటంలేదు. తమవంటి రసజ్ఞులు, ఆనందిస్తే చాలదా ?" అన్నాడు.

"అయితే చదవండి"—అని దిండుపైన తల సరిజేసుకొని కాళ్ళుజాపి పండుకొని వింటానికి సిద్ధపడ్డాడు నటుడు.

కవిగారు ప్రక్కనే కుర్చీలో కూర్చుని చదవటం ప్రారంభించాడు. పెద్దగొంతుకతో, "చూడండి, కవిగారు— అంత పెద్దగా చదవటం అనవసరం. మన ఇద్దరమేగా ఉన్నది!"

నిజమే ఆ మాట! కవి మెల్లగా చదవటం సాగించాడు. ఈ ప్రసిద్ధ నటుడు కళ్ళు మూస్తున్నాడు కవిగారికి కాస్త నిరుత్సాహం కలిగి తమకు నిద్ర వస్తున్నట్లుంది. పోనీ ప్రస్తుతం మానేస్తాను అన్నాడు.

"అఁహా—మీరు అట్లా ఏం చెయ్యవద్దు చదవండి" మీకు ఒకటే గుర్తు చెపుతున్నాను వినండి కావ్యం బాగుంటే, నాకు హాయిగా నిద్రపడుతుంది. నిద్రపట్టిందో నేను మీ కావ్యాన్ని విని ఆనందించినట్టు! లేక నిద్ర పట్టక తన్నుకొంటూ ఉంటినా మీ కావ్యం నాకు రసం అందియ్యనట్టు! ఇక చదవండి" అని అటు తిరిగి పడుకొన్నాడు. నాలుగు నిమిషాలైందో లేదో ఆయన గుర్రుపెట్టేశాడు. ఇవతల ఈ కావ్యం ఎంత రసవంతంగా ఉండకపోతే ఆయనకు అంత నిద్రపడుతుంది" ఇల్లాఉంది

కృష్ణారావుగారు దీనిని అంగీకరించక అన్నారు. 'ఇది చాలా బాగుంది కాని' ఏ పాటి కొద్ది మొత్తం ఇచ్చినా, ఆ ఆసామి, ఆ పుస్తకం తనకే అంకితం ఇస్తారను కొంటాడు, ఒకరు ఇచ్చిన డబ్బుతో పుస్తకం అచ్చు వేసి దానిని ఇంకొకరికి అంకితం ఇయ్యడం మర్యాద కాదు అన్నాడు.

అయితే ఏం చేద్దామని ప్రశ్న వచ్చింది. ఆయన సలహా ఇది ''నలుగురు ఇచ్చిన ధన సాహాయ్యంతో, ఒక పుస్తకం అచ్చు వేస్తున్నాము అను కోండి. నలుగురికీ అంకితం ఇద్దాము. కృతి భర్తలు అను పేరుతో ఒక పేజీలో—ఆ నలుగురి పేర్లు అచ్చు వేస్తే కొంత వరకు బాగుంటుంది.'

శాస్త్రిగారు ఈ సలహా బాగుండ లేదన్నారు. అల్లా చేయటం సదాచారం! కాదనీ, ఒక్క కృతికి ఒకే భర్త ఉండాలనీ అన్నారు. మళ్ళీ ఏం చేద్దామా అని చర్చించాము. కృష్ణారావుగారే, దానికో ఉపాయం చెప్పారు. 'వెయ్యి కాపీలు అచ్చువేసినప్పుడు ఒక్కొక్కరికి రెండు వందల యాభై కాపీలు అంకితం ఇయ్యటం మంచిది.''

ఈ ఏర్పాటు చాలా బాగుంది కాని మొదటి రెండు వందల యాభైకి కృతి భర్త అయిన ఆసామి మిగతా పుస్తకాలలో ఇంకొకరి పేరు చూస్తె ఏమను కొంటాడు అని అడిగాను నేను, అంతా నవ్వారు.

కృష్ణారావుగారు అన్నారు "అయితే ఒక పని చేద్దాము. ఒక్కొక్క భాగము ఒక్కొక్కరికి అంకితం ఇద్దాము!

అయితే మొదటి భాగము వీరికి, రెండో భాగము వీరికి అంటూ కృతి సమర్పణ వివరణ అంతా ఒక్క పేజీలో ఉండాలిసిందేగా'' అని అడిగారు శాస్త్రిగారు—

ఇదీ బాగుండలేదు అని తోచింది. ఒకరికి అంకితం ఇచ్చినట్లు మరొకరికి తెలియకుండా చేయుటం ఎల్లాగో తోచలేదు.

ఒక పెద్ద పుస్తకాన్ని నాలుగు చిన్న వాల్యూములక్రింద విడగొట్టి ఒక్కొక్కటి ఒక్కొక్కరికి అంకితం ఇస్తే ఏ ఇబ్బందీ ఉండదన్నారు కృష్ణారావుగారు అందరం ఏకగ్రీవంగా ఆమోదించాము.

ఈ కృష్ణారావుగారు బాగా చదువు కొన్నారు చిన్నప్పుడు. అయితే ఇప్పుడు ఏమీ చదవరు. నవ్య కవుల రచనలను గురించి ప్రసంగిస్తే, ఒక్కొక్క రచయితను గురించి బ్రహ్మాండమైన అభిప్రాయం ఇయ్యగలరు కాని ఇప్పటి రచయితలు వ్రాసిన చెత్త అంతా చదవటానికి ఆయనకు ఓపిక లేదు అంటారు.

ఆయన కేదైన పుస్తకం ఇచ్చి, పది రోజులైన తరువాత 'చదివారా?' అని అడిగితే, నవ్వుతూ నేను చదువలేదు గాని మా ఆడవాళ్ళు చదివారు. చాలా బాగుంది, అన్నారు' అంటాడు.

చాలా మంచివాడు. మా యింటికి తరుచూ వస్తూ, నాతో కులాసాగా కాలం గడుపుతూ ఉంటారు.

---

# 3

నా స్నేహితులలో మరో ఆయన ఒక కవి. పద్యాలు చాలా బాగా వ్రాస్తాడు. ఆయన పద్యాలు ఆయనే స్వయంగా చదువుతాడు. చాలా మధురంగా ఉంటుంది కవిత్వం.

ఆయన చదువుతూ ఉన్నప్పుడు విన్నవాళ్ళు ఏమను కొంటారు అంటే,—అహా! ఏమి ధారాశుద్ధి! ఏమి భావనాశక్తి! ఏమి కల్పన! ఇల్లాగ ఎంతో అను కొంటారు.

కాని సామాన్యంగా ఎవరికీ అర్థం కావు. అర్థం కాక పోయినా అర్థంఅయినట్టే ఉంటుంది. అది ఆయన కవిత్వంలో ప్రసాదగుణము.

ఆయనకు సన్మానాలూ అవీ జరుగుతూ ఉంటవి. మాతో తిరుగుతూనే ఉంటాడు. కని, ఆదివారాలలో వెళ్ళి ఇట్టే కొట్టుకొస్తూ ఉంటాడు కద్దరుచాపులు.

ఆయనను జూస్తే కొద్దో గొప్పో ఈర్ష్యకూడా ఉంది నాకు. నేనేమో జనసామాన్యానికి అర్థం అయ్యేలాగున వ్రాస్తుంటిని. నాకు ఒక్కరూ ఒక్కగజం గుడ్డముక్కయినా ఇయ్యరాయె. ఏకొద్దిమందికోగాని, అందరికీ అర్థం అయ్యే భాషలో ఆయన వ్రాయడు. ఆయనకు కనకాభిషేకం చేస్తారు. ఇది నిజంగా అన్యాయమని నా అభిప్రాయం. అందుకనే ఆయననుజూస్తే నాకు కాస్త ఇదిగా ఉంటుంది.

ఆయన అయినా నాయందు పెద్ద ఇదిగా ఏమీ ఉండడు, నేను కథలు వ్రాస్తానని ఆయనకు తెలుసు. అందుకనే ఒకరిని, ఒకరు గౌరవించుకొంటాము.

ఇద్దరం మంచి స్నేహితులము. ఆయన గొప్ప కవి అని నేను అందరితోనూ చెబుతూ ఉంటాను. నేనూ కూడా బాగా వ్రాస్తానని ఆయనకూడా ఇతరులతో నా ఎదటే అంటూ ఉంటాడు.

ఆయన పద్యరచనలు చదవకుండానే నేను అల్లాగ అంటూ ఉంటాను. నా కథలుగట్రా ఒకటికూడా చదవకుండానే ఆయన అల్లాగ అంటూ ఉంటాడు. మా యిద్దరికీ

చాలా మంచిస్నేహం ఏర్పడ్డది ! ఆయన యిల్లుకూడా మా యింటికి దగ్గరే.

ఆయన చమత్కారంగా కూడా మాట్లాడగలడు. అసలు నిజము ఏమిటంటే, ఆయన చమత్కారంగా మాట్లాడతాడనే, నేను ఆయనను ఎక్కువగా గౌరవిస్తాను.

ఆయన కాస్త పెద్దవాడూ పిల్లలుగలవాడూ కావటం చేత మా ఆవిడకూడా ఆయనతో చనువుగా మాట్లాడుతుంది. కష్టసుఖాలు చెపుతూ ఉంటుంది. ముఖ్యంగా నామీద నేరాలు.

ఒకరోజున అన్నది: "అన్నయ్యా ఈయన సంగతి బొత్తుగా ఏమీ బాగుండలేదు. ఎప్పుడూ ఏదో పరధ్యాన్నంగా ఉంటారు. మన ప్రపంచలోనే ఉండరు. నిన్న మటుకు ఏదో విషయం వస్తే అరగంట మొత్తుకున్నా ఒక్కమాటఅయినా ఆయన బుర్రలోకి ఎక్కలేదు. వెర్రిచూపులు చూస్తూ కూర్చున్నారు. ఇల్లాగ తయారయితే ఎందుకయినా పనికొస్తారా ! ఏ మంటారు.

జబ్బేవమికర్మమో మరి శాస్త్ర ఏదైనా మందో మాకో పుచ్చుకొంటే బాగుండును.

మా ఆవిడ ఈ మాటలు అన్నీ పలుకుతుంటే శ్రద్ధగా విని నవ్వి, 'ఇదేమి జబ్బుగాదమ్మ తల్లీ! జబ్బు ఏమాత్రమూ కాదు. భర్త ఆలాగ నీవుఏమన్నా పల్లెత్తి ఒకసారి అయినా మాట్లాడకపోవటం చూశావూ. అది ఒక సుగుణం. తలక్రిందుగా తపస్సుచేసినవాళ్ళకై నా అల్లాంటి సుగుణం గల భర్త దొరకడమ్మా. సంతోషించాలిసిన విషయము! అని చెప్పి నవ్వించాడు కవిగారు.

ఒకరోజున ఒక స్నేహితుడికి నాపైన మంచి కోపం వచ్చింది. అదైనా అకారణంగా రాలేదు. అతడు నన్ను కవిగారి ఎదుటే పట్టుకొని, చాలా కోపంగా మాట్లాడి, నేనేమీ మాట్లాడకపోవటం వల్ల, విసిగిపోయి చివరకు కఠినంగా అన్నాడు. 'నీవు ఎందుకూ పనికిమాలినవాడవు అయిపోతున్నావు!

ఆ మాటమీద నాకు చాలా కోపంవస్తుందని ఆయన అనుకొన్నాడు. నాకేమీ కోపంరాలేదు. ఆయన

అన్నమాటలన్నీ నేను జాగ్రత్తగానూ శ్రద్ధగానూ విన్నాను, విని తలవూపి 'నిజమే' అన్నాను.

'ఏమిటి నిజం?' అన్నాడు ఆయన పెద్దగొంతుకతో.

'ఏమున్నదీ, నీవు అన్నమాట నిజం. నేను ఎందుచేతనో బొత్తిగా పనికిరాకుండా పోతున్నాను నిజమే ఆ మాట' అన్నాను.

నేను ఇల్లాగ మాట్లాడటం అతనికేమీ బాగాలేదు. ఏదో తికమకలై, చివరకు నవ్వుతూ హేళనగా అన్నాడు. ''అయితే నీకూ తెలుస్తున్నదన్నమాట బొత్తిగా చెడిపోతున్నావని!

నేను తలవూపి 'ఆ' అన్నాను.

నన్ను తెలివితక్కువ వాణ్ణిగా చేసినందుకూ ఆ సంగతి నా చేతనే ఒప్పించినందుకూ ఆయన గర్వపడ్డాడు.

కవిగారు నాపక్కనే వున్నాడు. ఆయన అన్నాడు. 'చూడండి, తాను ఎందుకూ పనికిరాకుండా పోతున్నా

వని తెలుసునంటున్నాడు. ఈయన మనకంటే నయమే! ఈమాటలు విని అవతల ఆయన గబగబా నడిచి పోయినాడు.

మరొకసారి ప్రసంగకుశలుడు ఎవరూ అని ప్రశ్న వచ్చింది. విజ్ఞానమును ప్రదర్శిస్తూ వినయంగా మాట్లాడగల వాడు ప్రసంగకుశలుడు అని నే నన్నాను.

వినయంగా మాట్లాడగలిగి ఉండటం ఒక్కటే చాలదు. చమత్కారంగా మాట్లాడాలె అని కృష్ణారావు గారు అన్నారు.

చమత్కారం అంటె ఏమిటీ అని ఒకరు పృచ్ఛ చేశారు. వ్యవహారం పెరిగి పెద్ద శాస్త్రచర్చ లోకి దిగే సూచనలు కనిపించినై. ఎందుకంటే శాస్త్రిగారు, ప్రసంగకౌశల్యము అంటే, ఆ ప్రసంగసందర్భంలో వాడ బడే మాటలు, రమణీయార్థ ప్రతిపాదకములయి వుండా లనీ, లోకోత్తరమైన ఆనందం ఇయ్యాలని, రస సమన్వితము లయి వుండాలనీ "ఇల్లాంటి మాటలు జోరుగా రానిస్తు న్నాడు.

రసము అనేసరికి, రసమంటే ఏమిటని అడిగారు. రసము అంటే, ఏమిటో చాలా గొడవగా నిర్వచించారు శాస్త్రిగారు. అపశంగా నివ్వు అంటు కొన్నట్లు సంభాషణ తీవ్రతరమై పోతూ వుంటే, కవిగారు ఇల్లా అన్నారు,

'ఇష్‌ష్‌ష్, ఎందుకూ ఈ అనవసర చర్చ. ప్రసంగకుశలుడు ఎవరో నేను చెబుతాను వినండి.

తననుగురించీ (తన ఎదుట మనిషైయిన) నిన్ను గురించీగాక, ఇతరులనుగురించి మాట్లాడేవాడూ ప్రసంగ కుశలుడు కాడు—వాడి సంభాషణను వాగుడు అంటారు.

ఎంతసేపూ తనను గురించి మాట్లాడటం కూడా ప్రసంగకౌశల్యముకాదు: అట్టి సంభాషణను స్వోత్కర్ష అంటారు. తననుగురించి ఎత్తక, ఇతరుల ప్రశంస లేక నిన్నుగురించి. మెప్పుదలగా, చమత్కారంగా నొవ్వకుండా, ఆనందగా మాట్లాడగలవాణ్ణి చమత్కారశీలుడని, ప్రసంగకుశలుడని నీవు అంటావు. ఇది పరమ సత్యము అని ఆయన ఆ రోజున గంభీరమై సత్య ప్రవచనము చేశారు.

ఆయన గంభీరమైన ఉపన్యాసాలు ఇస్తారు. వింటూ వుంటే కాస్త భయంభయంగా వుంటుంది. నిప్పులు కురిపిస్తాడు. సాధారణంగా ఆ ధోరణిలో వుంటుంది.

ఒకసారి మాత్రం ఎందు చేతనో చప్ప చప్పగా వుంది. ఇంటికి వచ్చిన తరువాత మేము నలుగురం కలిసినపుడు నా ఉపన్యాసం ఎట్లా ఉన్నది అని కవిగారు అడిగారు. దానికి సమాధానము నాకు ఆంగ్లభాషలో దొరికింది. దానికి తెలుగు తర్జుమా చేసి మీ ఉపన్యాసంలో, ఇంకా కాస్త అగ్ని పడాలె అన్నాను.

కృష్ణారావుగారు నా మాటకు అడ్డువచ్చి అల్లా కాదు మీమీ ఉపన్యాసం ఇంకో కాస్త, అగ్నిలో పడాలె అని శ్లేషించారు.

కవిగారు కూడా మాతో కలిసి నవ్వుకొన్నారు. ఆయన మమ్ములను హేళన చేస్తుంటాడు; మేము ఆయనను చేస్తుంటాము

కవిగారు ఎర్రగా పొడుగ్గా వుంటారు. చాలా మంచివాడు. కార్య శూరుడు. దేశ భక్తుడు. దేశా

నికి బలం ప్రజ. ప్రజాభివృద్ధి అయితే, దేశానికి బలం, క్షేమం. ఈ విషయం ఆయన బాగా గ్రహించి, దేశాన్ని ఈవిధంగా బలపరచటానికి, ప్రజాభివృద్ధికీ శాయశక్తులా పాటు పడుతున్నాడు.

ఈయన కవిత్వాన్ని గురించి ఇతరులు ఏమంటారో చెప్పాను. నా అభిప్రాయం ఏమిటీ అంటే, నేను అంత గట్టిగా చెప్పలేను. కారణం కూడా ఇదివరకే చెప్పాను.

అయితే మనిషి దగ్గర మంది మాటపొందిక ఉంది. తిక్కనకు గల తిక్కలన్నీ ఈయనకూ వున్నాయి. ఇంకా ఎక్కువ ఏమిటంటే తిక్కన కవిత్వంలో నాల్గింటికి మూడు పాళ్ళు తెలుగు, ఒక పాలు సంస్కృతం. ఈయనగారి కవిత్వంలో మూడు పాళ్ళు సంస్కృతం, ఒక పాలు తెలుగు. నిష్పత్తి సంఖ్య ఒకటే గాని దినుసు మాత్రం వేరు.

మొత్తంమీద మధురమైన కవిత్వం వ్రాస్తాడు. తిక్కన తరువాత కవిత్వం చెప్పింది ఆయనే అని

ఆయన అభిప్రాయం. ఈమధ్య ఎవరైనా కుర్రవాళ్ళు వ్రాస్తున్నారేమో ఆయనకు బాగా తెలియదు. మా నలుగురికి ఉమ్మడిగా ఒక సహృదయుడు ఉన్నాడు. సహృదయుడు. ఎవరు అని ఒక మాటు ప్రశ్న వచ్చింది. మా కృష్ణారావుగారే సహృదయ నిర్వచనం చేశారు.

సహృదయుడు ఎవరో మనం కనిపెట్ట లేము. మామూలు మనిషి లాగే వుంటాడు. కాని కవి ఇట్టే పసిగట్ట గలడు. తాను వ్రాసింది ఓపిగ్గా విని, మెచ్చుకొన్నవాణ్ణి కవి సహృదయుడు అంటాడు.

మా సుందరానికి సహృదయుడికి కావలసిన లక్షణాలన్నీ వున్నాయి. మాలో నెవరేమి వ్రాసినా ఆయనకే వినిపిస్తూ వుంటాము, కథ కానీయండి నాటిక కానీయండి గంభీరమైన పద్య కావ్యం కానీయండి, ఆయన వినాలింసిందే !

ఆయనే ఈ పేటలో లేకపోతే మా గతి ఏమయ్యేదో ఊహించ లేము. ఆయన [illegible]లో లేకపోతే మేము పడే ఇబ్బంది యింతా అంతా కాదు.

మా పేటకు చుట్టుప్రక్కల నాలుగైదు మైళ్ళదూరంలో సహృదయుడు ఎవ్వరూ లేడు. ఊళ్ళోకి ఎవరైనా కవులు వస్తే సాధారణంగా కృష్ణా పత్రికా ఆఫీసుకు వెళ్ళి అడుగుతారు: ఏమండీ నేనొక కావ్యం వ్రాశాను. సహృదయులకు వినిపించాలని వుంది అని. కృష్ణాపత్రిక వాళ్ళు ఆయనతో 'స్వామీ! మీరు నక్కల తోటలోకి వెళ్ళండి, అక్కడ మీకు దొరుకుతారు అల్లాంటి మనుష్యులు అని అంటారట. నిజమేమి టంటే, యిక్కడ వున్నది ఒక్కడే సహృదయుడు. మిగతా వాళ్ళు అసహృదయులు.

ఇక మా సుందరం సంగతి ఎవరు ఏదైనా వ్రాయనీయండి. వినిపిస్తానంటే ఓపిగ్గా వింటాడు. విన్నందుకు ఏమీ పుచ్చుకోడు. అందులో శ్రద్ధగా వింటాడు. తల వూపుతాడు. నవ్వుతాడు. చివరకు మెచ్చుకొంటాడు.

మేము ఏదైనా సభ ఏర్పాటు చేసినపుడు ఆయనను ముందు కూర్చో బెడతాము. మేము వెనకాల చేరి, ఆయనతో పాటు మెప్పుదలను సూచించే శబ్దాలను చేస్తుంటాము. మా కందరికీ సహృదయు లను పేరు

ఇందు మూలంగా వచ్చింది. వచ్చిన వాళ్ళంతా సంతోషించి పోతున్నారు.

ఆయన బాగా చదువు కొన్నవాడు. మంచి విమర్శకుడు. తల్చుకొంటే ఏదైనా కావ్యాన్ని చీల్చి చెండాడ గలడు. అంత సామర్థ్యం వుంది. అయితే సహృదయుడు కావటంచేత బ్రతికి పోతున్నాము.

కర్మం జాలక ఘాటు అయిన విమర్శన చేశాడా, మా పేటకున్న పేరు ప్రతిష్టలు ఆ రోజుతో నాశనం. ఇంతవరకు ఆ పని జరగ లేదు.

కవికీ, కథకుడికీ సహృదయుడు ఎంత అవసరమో, ఇతరులు ఏమాత్రమూ గ్రహించలేరు. సహృదయులు దగ్గరలో లేకపోవటం మూలాన, ఎందరి కవుల యొక్క కవితా ఆవేశం, ఇంకి పోతున్నదో! కవి ఏదో వ్రాసిన వాడు ఊరుకోడు. ఆ వ్రాసిన రచన చేత పట్టుకొని సహృదయుడి కోసం వెతుక్కుంటూ వెడతాడు. అటు తరువాత లోకంలో వున్న ఇతర సహృదయుల కోసం అచ్చు వేయిస్తాడు. మా అదృష్టంకొద్దీ మాకు ఈయన దొరికాడు.

ఆయన ఒక్క పద్యంగాని, కథగాని వ్రాయకుండా మేము వ్రాసే సమస్తమూ వింటూ వుండడము మూలానే

ఆయన సహృదయత్వమూ నిలుస్తుంది. ఆయన నేను కూడా వ్రాస్తాను, వ్రాస్తాను అంటూ మమ్మలను భయ పెడుతున్నాడు ఈ మధ్య. ఇంత వరకూ ఆయ నేమీ వ్రాయ లేదు.

కర్మ జాలక ఆయన రెండు ముక్కలు ఏదయినా వ్రాశాడా, మాకు వున్న ఈ ఒక్క సహృదయుడూ జారిపోవటం జరుగుతుంది. ఇంకో ఇబ్బంది కూడా వుంది. ఆయన రచయిత అయితే ఆయన వ్రాసింది వినటానికి సహృదయు డేడి? ఇక ఆయన గుడివాడ పోవలసిందే తన రచన వినిపించ టానికి. ఆ సంగతి ఆయన కాస్త ఆలోచించుకోవాలి.

అదృష్ట వశాత్తు ఆయన ఇంకా ఏమీ వ్రాయ లేదు.

సహృదయుడితో కలుపుకొని మేము అయిదుగురమూ ఒక పేటలో ఒకదగ్గరే వుంటున్నాము. అందరమూ, అప్పు డప్పుడు కలుస్తూవుంటాము.

సహృదయుణ్ణి వదిలేస్తే, మిగతా నలుగురిలోనూ ఇద్దరు వైదికులూ, ఇద్దరు నియోగులూ! మా వూళ్ళో వైదికులనుచూస్తే నియోగులకు గిట్టదు. మా పేటలో వ్యవ హారమూ అంతే. ఇద్దరు నియోగులమూ కలిసి చాటు మాటుగా వైదికులనూ వాళ్ళ రచనలనూ తిడుతూ వుం టాము. వాళ్ళూ మమ్మలను తిడుతూ వుంటారు. కాని

మేము నలుగురమూ కలిసినపుడు మాత్రం పైవాళ్ళను తిడుతూ వుంటాము.

ఇప్పటి, అందరు రచయితలకువలెనే మేమూ, రచనలు చేస్తున్నా, ఒకరిరచనలు ఒకరు చదవము.

అయితే ఎందుకు వ్రాస్తున్నారయ్యా అంటే, సహృదయులకోసం.

మేము వ్రాసినదంతా చదవటానికి ఎవరో, ఎక్కడో సహృదయులు వున్నారు. వారికోసం మేము శ్రమపడుతున్నాము.

నవ్యసాహిత్య పరిషత్సభ్యులూ, సాహితీ సమితి సభ్యులూ, ఇంకా ఇల్లాంటి సంఘాల సభ్యులూ, ఈ నియమాన్ని పాటిస్తున్నారు. అందుకనే మేము, మాలో ఒకరి రచనలు ఒకరుగాని ప్రతిఒక్కరూ, ఇతరుల రచనలుగాని చదువ కూడదని నియమం, ఏర్పరచుకోకపోయినా, ఏర్పరుచుకొన్నంత కట్టుదిట్టంగా పాలిస్తున్నాము.

అయితే ఎవరయినా కవిగాని కథకుడుగాని వచ్చి మాకు తమ రచనలు వినిపిస్తామంటే, వెంటనే ఒక సభ ఏర్పాటుచేసి, ఊళ్ళోవున్న పెద్ద మనుష్యులనందరినీ ఆహ్వానం చేస్తాము.

సభ కూడిన తరువాత, కవిగారిని (కొత్తకవి) ప్రారంభించమని ఆ సహృదయులంతా వింటూ వుంటే మేముమాత్రం అక్కడ కూర్చోక కాస్త బయటికివెళ్ళి, సిగిరెట్లు తగలేస్తూ, ఆ కవిగారిని, ఆయన కవిత్వాన్ని గురించి హేళనగా మాట్లాడుకొంటాము.

కవిగారు చదవటం పూర్తి అయిన తరువాత మాలో ఎవరమో ఒకరం వచ్చి, కవిగారిని ప్రశంసిస్తూ, వారి కవిత నిర్దుష్టమైనదనీ మృదుమధుర మైనదనీ, ఏదో ఇల్లాంటి మాటలతో ఒక పావుగంట ఉపన్యాసం ఇస్తాము.

ఇంకో సంగతికూడా వుంది. ఎవరైనా వచ్చి మమ్ములను సన్మానం ఒకటి ఏర్పాటుచేయించమని అడగటంకూడా వుంది. అల్లాంటప్పుడు ఊళ్ళో చందాలు పోగుచేసి ఏదో ఒక చిన్నసన్మానంకూడా చేస్తాము. ఇంతవరకు లేకుండా చేస్తున్నాము. ఇక ముందుమాట చెప్పలేము. మాదగ్గర సన్మానాలు చేయించుకుపోయేవాళ్ళు మాకు ఎక్కడైనా సన్మానాలు ఏర్పాటు చేస్తారని ఆశ. కాని లోకంలో కృతజ్ఞత కనపడదు.

సంపూర్ణము.

